# శమీ పూజ ,శమీ అష్టోత్తర శతనామావళి



## శమీపూజ

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం|

ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వ విఘ్నోప శాంతయే||

అగజానన పద్మార్కం గజానన మహర్నిశం|

అనేక దంతం భక్తానాం ఏకదంతముపాస్మహే

వక్రతుండ మహాకాయ సూర్యకోటి సమప్రభ|

నిర్విఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా||

శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం

విశ్వాకారం గగన సదృశం మేఘవర్ణం శుభాంగం |

లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం

వందే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథం ||

వందే శంభుముమాపతిం సురగురుం వందే జగత్కారణం

వందే పన్నగభూషణం శశిధరం వందే పశూనాం పతిమ్ |

వందే సూర్యశాశాంక వహ్నినయనం వందే ముకుందప్రియం

వందే భక్తజనాశ్రయం చ వరదం వందే శివం శంకరమ్ ||

సరస్వతీ నమస్తుభ్యం వరదే కామరూపిణీ |

విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా ||

యా కుందేందు తుషార హార ధవళా, యా శుభ్ర వస్త్రావృతా |

యా వీణా వరదండ మండిత కరా, యా శ్వేత పద్మాసనా ||

యా బ్రహ్మాచ్యుత శంకర ప్రభృతిభిర్-దేవైః సదా పూజితా |

సా మామ్ పాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా ||

తిథి, వారము, వర్జ్యము, తారాబలము, గ్రహబలము, ముహూర్తము మున్నగునవి విచారించకుండా; విజయదశమినాడు చేపట్టిన ఏకార్యము అయినా విజయముతథ్యము అని 'చతుర్వర్గ చింతామణి' అనే ఉద్గ్రంథము ఆశ్వీయుజ శుక్ల దశమినాటి నక్షత్రోదయ వేళనే 'విజయం' అని తెలిపియున్నది. ఆ పవిత్ర సమయము సకల వాంఛితార్థ సాధకమైనదని నమ్మకం..

మహిషాసుర మర్దని అమ్మవారు మహిషాసురునితో తొమ్మిది రోజులు యుద్ధం చేసి ,పదవ రోజైన ఆశ్వయుజ శుద్ధ దశమి నాడు వాడిని సంహరించి విజయం సాధించింది. అందుకే ఆరోజుకు విజయదశమి అనే పేరొచ్చింది.పూర్వం రాజులు ,జమిందార్లు లోక కల్యాణం కోసం ,వాళ్ళ విజయం కోసం ,వారి పాలనలో ఉన్న దేవాలయాలలోశమీ పూజోత్సవాలు చేసేవారు . సాయంకాలం పూజ తర్వాత స్వామిని గుర్రం పై ,వేదమంత్రోచ్చరణతో ,మేళ తాళాల ఛత్ర చామర మర్యాదలతో తో ఊరేగించి ,,శమీ వృక్షం దగ్గరకు వెళ్లి ఆ వృక్షానికి ,ఆయుధాలకు పూజ చేసి ,విజయం కోసం నాలుగు దిక్కులలో,వృక్షం పై అగ్రంపైనా బాణాలు సంధించి వదిలే వారు. ఇది శత్రునాశనానికి చిహ్నం . ప్రస్తుత సంవత్సరం విజయదశమినుంచి వచ్చే సంవత్సరం విజయ దశమి పర్యంతం అష్ట దిక్కులా తనకు తన కుటుంబానికి దిగ్విజయం కలగాలని. " విజయ పత్రం. " రాసి శమీ వృక్షం మొదట్లో ఉంచుతారు. ఇందులో గోత్రం ,పేరు రాయాలి. శమీ వృక్షానికి అందరూ ప్రదక్షిణాలు చేసి ,శమీ పత్రాలను కోసి భక్తితో కళ్ళకు అద్దుకొని శిరస్సున ఉంచుకొని ఆలయానికి వస్తారు.

మనం ఒక తెల్లకాగితం మీద పైన శ్రీ రస్తు--- శుభమస్తు ----అవిఘ్నమస్తు అని దూర దూరంగా రాసి దానికింద

శ్లో|| శమీ శమయతే పాపం శమీశత్రు నివారిణీ |

అర్జునస్య ధనుర్ధారీ రామస్య ప్రియదర్శిని

అనే శ్లోకం రాసి ,దానికింద స్వస్తిశ్రీ చాంద్రమాన __________( శుభకృత్) నామ సంవత్సర ఆశ్వయుజ శుద్ధ దశమి –విజయదశమినుంచి ,శోభకృత్ నామ సంవత్సర ఆశ్వ యుజ శుద్ధ దశమి విజయ దశమి పర్యంతం

అని రాసి, తర్వాత(________( గౌతమస) గోత్రం –తర్వాత_________ ( గబ్బిట దుర్గాప్రసాద్) కు కుటుంబానికి అష్టదిక్కులా దిగ్విజయం కలుగుగాక అనిరాసి శ్రీశ్రీ శ్రీశ్రీ శ్రీ అని అయిదుసార్లు

రాసి పసుపు ,కుంకుమ అంటించి శమీ వృక్షంలేక కొమ్మ కింద ఉంచాలి. గుడిలో అయితే అర్చకస్వామి శమీ కొమ్మకు బియ్యాన్ని మూటలో కట్టి ,మనం రాసిన కాగితాలన్నీ కొమ్మ క్రింద పెట్టి అష్టోత్తర పూజ చేస్తాడు. కాగితం బాణాలు తయారు చేసి ధర్మకర్త చేత నాలుగు దిక్కులకు బాణాలు వదిలిస్తాడు.

జమ్మి చెట్టుకు ఇంతటి ప్రాధాన్యం రావటానికి కారణం ఆ వృక్షాధి దేవత అగ్ని దేవుడు అవటమే. అగ్నిదేవుని వలననే దేవతలకు హవిస్సులు అందిస్తాము. ఆయన ద్వారానే దేవతలను ఆహ్వానించటం సంప్రదాయం.. 'హిరణ్య వర్ణాంహరిణీం సువర్ణ రజతస్రజాం చంద్రాం హిరణ్మయీంలక్ష్మీం జాత వేదో మమావహః. " అనే వేదవాక్యం లో. " అగ్నిదేవా !లక్ష్మీదేవిని నేను పూజించటానికి ఆమెను ఆహ్వానించు. " అని ఉంది. ఇంతటిప్రభావం కల అగ్ని శమీ వృక్షానికి అధి దేవుడు. అందుకే జమ్మికి అంతటి ప్రాధాన్యం. అంతేకాదు. " శమీ కీర్తనా దేవపాపం నశ్యతి వాచికం-స్మరణాన్మానసం

పాపం ,స్పర్శనాత్కాయజం తదా –నిత్యం తత్పూజ నా ,ధ్యానా ద్వంద్వ నా చ్చైవభక్తితః-నిర్విఘ్న కరమాయుష్యం,జ్ఞానం ,పాప క్షయోపిచ. " . అంటే శమీ అని నోటితో అంటే నోటితోచేసినపాపాలు ,మనసులో శమీ అనుకొంటే ,మనసుతో చేసిన పాపాలు ,,శమీ అని తాకి నమస్కరిస్తే శారీరక పాపాలు పోవటమేకాక ప్రతిరోజూ పూజిస్తే దీర్ఘాయువు జ్ఞానం కలుగుతాయి. ఆనంద రామాయణం లో శ్రీ రాముడు రోజూ శుద్ధుడై నిత్యకర్మలు చేసి ,వట వృక్షం, బిల్వ ,శమీ, ఆశ్వత్థం తులసీ మొదలైనవృక్షాలను పూజిస్తాడని ఉంది.

కర్ణాటక లో విజయదశమి పండుగనాడు" జంబూ సవారీ" అనే ఉత్సవం చేస్తారు. సాయంకాలం అందరూ కొత్తబట్టలు కట్టుకొని గ్రామానికి వెలుపల దగ్గరలో ఉన్న మరో గ్రామానికి నడచిలేక బళ్లమీద బస్సులమీద ఊరేగింపుగా వెళ్లి అక్కడి దేవాలయం లో దైవ దర్శనం చేసి తిరిగి ఇంటికి వస్తారు. మా చిన్నతనం లో హిందూ పురం లో ఇలానే చేసే వాళ్ళం. హిందూ పురంనుంచి బెంగుళూరు రోడ్డులో ఉన్న సూగూరు వెళ్లి అక్కడి ఆంజనేయస్వామిని దర్శించి తిరిగి వచ్చేవాళ్ళం.జట్కాబండి వాళ్ళు బస్సులవాళ్ళు అందర్నీ ఉచితంగా ఎక్కించుకొని జంబూ సవారీ సరదాగా జరిపేవారు. దీన్నే సీమోల్లంఘనం అంటారు.

అలాగే రాజులు ,జమీందార్లు పార్వేట ఉత్సవం చేసేవారు ఇదే విధానం లో. మన తిరుమల,వరదరాజస్వామి మొదలైన ప్రసిద్ధ ఆలయాలలో కూడా స్వామి ఉత్సవ విగ్రహానికి క్షత్రియ వేషం వేసి కనుమ పండుగనాడు పార్వేట ఉత్సవం చేస్తారు ,,.

ఇంకా దేవదానవులు పాల సముద్రమును మధించినప్పుడు అమృతం జనించిన శుభమూహూర్త దినం ఈ విజయదశమి రోజునే అని తెలియజేయబడింది. "శ్రవణా" నక్షత్రంతో కలసిన ఆశ్వీయుజ దశమికి "విజయా" అనే సంకేతము ఉన్నది. అందుకనే దీనికి "విజయదశమి" అను పేరు వచ్చినది.

ఈ విజయదశమినాడు స్త్రీలు ఎంతో సుందరంగా బొమ్మల కొలువు తీర్చిదిద్ది ముత్తైదువులను పిలుచుకుని పేరంటం పెట్టుకొని వారికి వాయినాలతో సత్కరించి వారి ఆశీస్సులు పొందుతూ ఉంటారు.

అలాంటి విజయ దశమి రోజు మరింత ముఖ్యమైనది "శమీపూజ". శమీవృక్షమంటే "జమ్మిచెట్టు" అజ్ఞాతవాసమందున్న పాండవులు వారి వారి ఆయుధములను వస్త్రములను ఈ శమీవృక్షముపై దాచారు. తిరిగి అజ్ఞాతవాసము పూర్తిఅవగానే ఆ వృక్షమును పూజించి ప్రార్థించి తిరిగి ఆయుధములను వస్త్రములను పొంది ఆ శమీవృక్షరూపమున ఉన్న "అపరాజితా" దేవి ఆశీస్సులు పొంది కౌరవులపై విజయము సాధించినారు. శ్రీరాముడు ఈ విజయదశమి రోజున ఈ 'అపరాజితా' దేవిని పూజించి రావణుని సంహరించి విజయము పొందినాడు. తెలంగాణా ప్రాంతమందు శమీపూజ అనంతరం పాలపిట్టను చూసే ఆచారంకూడా ఉన్నది.



ఇలా అందరూ నవరాత్రులు జరుపుకుని విజయదశమిరోజు సాయంత్రం నక్షత్ర దర్శన విజయ సమయాన శమీవృక్షం (జమ్మిచెట్టు) వద్దగల అపరాజితాదేవిని పూజించి ఈ శ్లోకంతో;

శ్లో|| శమీ శమయతే పాపం శమీశత్రు నివారిణీ |

అర్జునస్య ధనుర్ధారీ రామస్య ప్రియదర్శినీ ||

అని ఆ చెట్టుకు ప్రదక్షణలుచేస్తూ పై శ్లోకము స్మరిస్తూ ఆ శ్లోకములు వ్రాసుకున్న చీటీలు అందరూ ఆ చెట్టు కొమ్మలకు తగిలిస్తారు. ఇలా చేయుటవల్ల అమ్మవారి కృపతో పాటుగ, శనిదోష నివారణ కూడా జరుగుతుందని ప్రతీతి.

ఇలా మానవులు అసాధ్యాలను సుసాధ్యాలను చేయాలన్నా, మనకు ఏర్పడిన దారిద్ర్యం తొలగిపోవాలన్నా ఆయురారోగ్య ఐశ్వర్యములతో ఇహలోక పరలోక సుఖాలను పొందుటకై. ఈ "శరన్నవరాత్రి" దసరావైభవంలో పాలుపంచుకుని సర్వులూ పునీతులు అవుదురుగాక...!

ఇందులో ఉన్న అంతరార్థాన్ని తెలుసుకొందాం. పంచ పాండవులు అనగా శరీరంలో ఉండే ఐదు జ్ఞానేంద్రియాలు, తమ ఆయుధాలను అనగా ప్రవృత్తులను లేదా ఇంద్రియాలు చేసే పనులను శమీవృక్షం మీద పెట్టాలి. 'శమి' అనగా శాంతింపచేసేది లేదా నిగ్రహింపచేసేదని అర్థం. మన శరీరంలోని ఏ చిన్న భాగం కదలికయినా బుద్ధిప్రేరణతోనే జరగాలి. కావున 'శమి' అనగా బుద్ధి, అన్ని ఆయుధాలు బుద్ధిలోనే కలవు. 'బుద్ధి'కి నిజమైన ఆయుధాలు 'ఆలోచనలు'. ఈ ఆయుధాలు శత్రువులకు పాములు, భూతాలులాగా కనబడతాయి. అనగా మన ఆలోచనలే శత్రువుల విషయంలో పాములై కాటేసి, భూతాలు వలె భయపెడతాయి కాని ఆత్మీయులకు పూలమాలలు అవుతాయి. మన బుద్ధే జ్ఞానలక్ష్మి. కావున అమ్మవారిని జ్ఞానప్రసూనాంబిక, విద్యాలక్ష్మి, జ్ఞానలక్ష్మి, మోక్షలక్ష్మి అని చెపుకుంటాము. మరొక వ్యాఖ్యానంలో 'శమి' అనగా లక్ష్మీదేవి. బుద్ధి అమ్మయే కావున అమ్మబుద్ధిని అనుసరిస్తే సకల విజయాలు చేకూరుతాయి. విజయదశమిని" దశహరా" అని అన్నాము అనగా పది పాపాలు తొలగించేది. పది ఇంద్రియాలతో చేసే పది పాపాలను తొలగించేది, ఇంద్రియాలతో పాపాలను చేయించేది బుద్ధే కావున మంచి బుద్ధిని ప్రసాదించమని ఆ తల్లిని కోరుతూ అలాగే విజయదశమినాడు దేవతా వృక్షాలలో ప్రసిద్ధమైనది 'శమి వృక్షా'న్ని దుష్టఆలోచనలను, దురాశలను, దుర్బుద్ధిని పారద్రోలడానికి పూజించాలి.

శమీ శమయతే పాపం

శమీ నాశయతే రిపూన్

శమీ విత్తంచ పుత్రంచ

శమీ దిత్సతి సంపదమ్

అనే ఈ పద్మపురాణ శ్లోకాన్ని శమీవృక్షం వద్ద పఠించాలి. శమీవృక్షము అనగా లక్ష్మీనారాయణులకు సం కేతం. మంచి బుద్ధి కలిగి తద్వారా లోక కళ్యాణం జరగాలని శమీపూజ అంతరార్థం.

మొత్తం మీద చెడు పై మంచి సాధించే విజయమే విజయదశమి అని గుర్తించాలి.

## శమీ అష్టోత్తరం

ఈశాన్యైనమః

పాపశమన్యైనమః

వశన్యైనమః

శివాఫలాయైనమః

లోహిత కంకటాయైనమః

అర్జున బాణ సంరక్షకాయైనమః

రామస్య ప్రియ దర్శినిన్యైనమః

యాత్రాయాం సుఖ ప్రదాయైనమః

నిర్విఘ్న కర్తృకాయైనమ

10-శ్రీరామ పూజితాయైనమః

అగ్నికాంతిప్రతీకాయైనమః

విఘ్నేశ పూజా విధాయకాయైనమః

శని దోష నివారకాయైనమః

యుద్ధ విజయ సాధకాయైనమః

పాండవాయుధ రక్షకాయైనమ

కుష్ఠువ్యాధి నివారకాయైనమః

ఇభ వక్త్రాయనమః

గర్భ స్రావ నివారకాయైనమః

కఫ నివారకాయైనమః

20-శ్లేష్మధ్వంస కాయైనమః

ఏక వింశతి పత్రికా ముఖ్యైనమః

రోమనివారణాయైనమః

భూసార వృద్ధిదాయైనమః

పాంధఛాయా కల్పితాయైనమః

పోషకాహారాయైనమః

శాకపాక వినియోగాయైనమః

దంత వ్యాధి నివారిణ్యైనమః

సర్వ రోగనివారిణ్యైనమః

అపరాజితా దేవీ ప్రియాయైనమః

30-గోత్ర వంశాభి వృద్ధి దాయిన్యైనమః

క్షీర పక్షి ప్రియాయైనమః

కల్ప వృక్ష సమాయైనమః

పశు సంరక్షకాయైనమః

శ్రీ భద్రాయై నమః

పుణ్యదాయైనమః

పుణ్యరూపిణ్యైనమః

జానకీదుఃఖ శమన్యైనమః

సర్వ కల్మష సంహార్యై నమః

కామితార్ధ ప్రదాయై నమః

40-సత్య రూపాయయై నమః

శుభ ప్రదాయై నమః

శుద్ధాయై నమః

శక్త్యైనమః

పూతాత్మికాయై నమః

చతుర్వ్వర్గ ఫలదాయైనమః

త్రిలోక జనన్యై నమః

మూల ప్రకృతిసంజ్ఞికాయైనమః

బ్రహ్మ రూపి ణ్యైనమః

అవాజ్మానస గోచరాయై నమః

50-పంచ భూతాత్మికాయైనమః

పంచ కలాత్మికాయైనమః

నిర్గుణాయై నమః

నిత్యాయైనమః

నిరాటంకాయనమః

దీన జన వత్సలాయై నమః

చతురానన సేవితాయైనమః

సిద్ధి ప్రదాయై నమః

అమలాయై నమః

కమలాయై నమః

60-లోక వందితాయై నమః

లక్ష్మైనమః

రామ ప్రియాయైనమః

విష్ణు ప్రియాయై నమః

తటిల్లతాంగ్యై నమః

ప్రకృత్యై నమః

సర్వ భూత హిత ప్రదాయై నమః

విభూత్యై నమః

పరమాత్మికాయై నమః

శుచయే నమః

70-ధన్యాయై నమః

నిత్య పుష్టాయై నమః

దీప్తాయై నమః

రమాయై నమః

వసు ధారి ణ్యై నమః

క్రోధ సంభవాయై నమః

అనుగ్రహ ప్రదాయై నమః

అశోకాయై నమః

లోక శోక వినాశిన్యై నమః

అనఘాయై నమః

80-కరుణాయై నమః

ధర్మ నిలయాయై నమః

లోక మాత్రేనమః

దేవ్యై నమః

సుప్రసన్నా యైనమః

ప్రభాయై నమః

ఆహ్లాద జనన్యై నమః

విమలాయై నమః

విశ్వ జనన్యై నమః

వహ్నా ధరాయై నమః

90-యశస్విన్యై నమః

జయాయై నమః

మంగళ ప్రదాయై నమః

సర్వ దిక్ శుభ దాయకా యైనమః

వంశ ప్రవృద్ధయై నమః

గోత్రాభి వృద్ధ్యైనమః

ప్రసన్నాక్షాయై నమః

సర్వోపద్రవ వారి ణ్యైనమః

బ్రహ్మ విష్ణు శివాత్మికాయై నమః

త్రికాల జ్ఞాన సంపన్నాయై నమః

100-పూర్ణాయై నమః

అనంగాయై నమః

స్తవ్యాయై నమః

పరమాయై నమః

తరణాయై నమః

భగవత్యై నమః

తత్వ త్రయ్యై నమః

మత్యై నమః

మాత్రేనమః

హిత కారిణే నమః

110-మాన్యాయై నమః

రాజ్య లక్ష్మై నమః

సర్వ సంపత్తి దాయై నమః

భోగ లక్ష్మైనమః

మహా జయాయై నమః

మహా బోధాయై నమః

మహా బంధన సంహారి ణ్యై నమః

మహా వృక్షాయై నమః

మహా ఛాయాయై నమః

మహానఘాయై నమః

120-మహా శ్వాసాయై నమః

మహా సారాయై నమః

మహా క్షాన్త్యై నమః

యశస్విన్యై నమః

మహారోగ వినాశిన్యై నమః

మహా క్షేమంకర్యై నమః

మహా విష నివారిణ్యై నమః

మహా శుభద్రాయై నమః

మహా సత్యై నమః

మహా నిత్యాయై నమః '

130-మహా శివ ప్రియాయైనమః

చిన్మయాకారాయై నమః

కాత్యాయిన్యై నమః

మాతృకాయై నమః

అజ్ఞాన శుద్ధ్యైనమః

సృష్టి రూపాయైనమః

పురుషార్థ ప్రదాయిన్యైనమః

వరదాయై నమః

భయ నాశిన్యైనమః

140-విశ్వ లోష్యణ్యైనమః

కుల సంపత్ప్రదాయై నమః

ప్రణవాత్మికాయై నమః

ఈశ్వర్యై నమః

చింతితార్ధ ఫల ప్రదాయి నమః

సర్వ మంత్ర మన్యైనమః

అమేయాయై నమః

అక్రూరాయై నమః

సర్వాస్త్ర ధారిణ్యై నమః

భూమిజాయై నమః

150-స్వ తేజసాయై నమః

బ్రాహ్మై నమః

జగద్ధితాయైనమః

మాన్యాయై నమః

నిరంజనాయై నమః

నిగమ గోచరాయై నమః

పూజ్యయైనమః

ధర్మ ప్రియాయై నమః

సర్వోపద్రవ వారిణ్యైనమః

లోకానంద దాయికాయైనమః

160-ఓం శ్రీ శమీ దేవతాయై నమః

ఓం శ్రీ శమీ దేవతాయై నమః

ఓం శ్రీ శమీ దేవతాయై నమః

ఓం శ్రీ శమీ దేవతాయై నమః

ఓం శ్రీ శమీ దేవతాయై నమః



# సరసభారతి

# శమీ అష్టోత్తరం



శ్లో॥ శమీ శమయతే పాపం శమీశత్రు నివారిణీ
అర్జునస్య ధరుర్ధారీ రామస్య ప్రియదర్శినీ

ఈశాన్యైనమ:
పాపశమన్యైనమ:
వశన్యైనమ:
శివఫలాయైనమ:
లోహిత కంకటాయైనమ:
అర్జున బాణ సంరక్షకాయైనమ:
రామస్య ప్రియ దర్శినిన్యైనమ:
యాత్రాయాం సుఖ ప్రదాయైనమ:
నిర్విఘ్న కర్తృకాయైనమ:
శ్రీరామ పూజితాయైనమ: -10
అగ్నికాంతిప్రతీకాయైనమ:
విఘ్నేశ పూజా విధాయకాయైనమ:
శని దోష నివారకాయైనమ:
యుద్ధ విజయ సాధకాయైనమ:
పాండవాయుధ రక్షకాయైనమ:
కుష్టువ్యాధి నివారకాయైనమ:
ఇభ వక్త్రాయనమ:
గర్భ స్రావ నివారకాయైనమ:
కఫ నివారకాయైనమ:
శ్లేష్మధ్వంస కాయైనమ: -20
ఏక వింశతి పత్రికా ముఖ్యైనమ:
రోమనివారణాయైనమ:
భూసార వృద్ధిదాయైనమ:
సాంథఛాయా కల్పితాయైనమ:
పోషకాహారాయైనమ:
శాకపాక వినియోగాయైనమ:
దంత వ్యాధి నివారిణ్యైనమ:
సర్వ రోగనివారిణ్యైనమ:

అపరాజితా దేవీ ప్రియాయైనమ:
గోత్ర వంశాభి వృద్ధి దాయిన్యైనమ: -30
క్షీర పక్షి ప్రియాయైనమ:
కల్పవృక్ష సమాయైనమ:
పశు సంరక్షకాయైనమ:
శ్రీ భద్రాయైనమ:
పుణ్యదాయైనమ:
పుణ్యరూపిణ్యైనమ:
జానకీదు:ఖ శమన్యైనమ:
సర్వ కల్మష సంహార్యై నమ:
కామితార్థ ప్రదాయైనమ:
సత్య రూపాయయైనమ: -40
శుభ ప్రదాయై నమ:
శుద్ధాయై నమ:
శక్త్యైనమ:
పూతాత్మికాయైనమ:
చతుర్వర్గ ఫలదాయైనమ:
త్రిలోక జనన్యై నమ:
మూల ప్రకృతిసంజ్ఞకాయైనమ:
బ్రహ్మ రూపి ణ్యైనమ:
అవాజ్మానస గోచరాయై నమ:
పంచ భూతాత్మీకాయైనమ: -50
పంచ కలాత్మికాయైనమ:
నిర్గుణాయై నమ:
నిత్యాయైనమ:
నిరాటంకాయనమ:
దీన జన వత్సలాయైనమ:
చతురానన సేవితాయైనమ:
సిద్ధి ప్రదాయై నమ:
అమలాయై నమ:
కమలాయై నమ:
లోక వందితాయై నమ: -60

లక్ష్మైనమ:
రామ ప్రియాయై నమ:
విష్ణు ప్రియాయై నమ:
తటిల్లతాంగ్యై నమ:
ప్రకృత్యై నమ:
సర్వ భూత హిత ప్రదాయై నమ:
విభూత్యై నమ:
పరమాత్మికాయై నమ:
శుచయే నమ:
ధన్యాయై నమ: -70
నిత్య పుష్టాయై నమ:
దీప్తాయై వమ:
రమాయై నమ:
వసు ధారిణ్యై నమ:
క్రోధ సంభవాయై నమ:
అనుగ్రహ ప్రదాయై నమ:
అశోకాయై నమ:
లోక శోక వానాశిన్యై నమ:
అనఘాయై నమ:
కరుణాయై నమ: -80
ధర్మ నిలయాయై నమ:
లోక మాత్రేనమ:
దేవ్యై నమ:
సుప్రసన్నాయైనమ:
ప్రభాయై నమ:
ఆహ్లాద జనన్యై నమ:
విమలాయై నమ:
విశ్వ జనన్యై నమ:
వహ్నిధరాయై నమ:
యశస్విన్యై నమ: -90
జయాయై నమ:
మంగళ ప్రదాయై నమ:

సరసభారతి

Design

# సరసభారతి

## శమీ అష్టోత్తరం

ధర్మ నిలయాయై నమ:
లోక మాత్రేనమ:
దేవ్యై నమ:
సుప్రసన్నాయైనమ:
ప్రభాయై నమ:
అహ్లాద జనన్యై నమ:
విమలాయై నమ:
విశ్వ జనన్యై నమ:
వహ్నిధరాయై నమ:
యశస్విన్యై నమ: -90
జయాయై నమ:
మంగళ ప్రదాయై నమ:
సర్వ దిక్ శుభ దాయకా యైనమ:
వంశ ప్రవృద్ధయై నమ:
గోత్రాభి వృద్ధ్యైనమ:
ప్రసన్నాక్షాయై నమ:
సర్వోపద్రవ వారి ణ్యైనమ:
బ్రహ్మ విష్ణు శివాత్మికాయై నమ:
త్రికాల జ్ఞాన సంపన్నాయై నమ:
పూర్ణాయై నమ: -100
అనంగాయై నమ:
స్తవ్యాయై నమ:
పరమాయై నమ:
తరణాయై నమ:
భగవత్యై నమ:
తత్వ త్రయ్యై నమ:

మహాసారాయై నమ:
మహా వృక్షాన్యై నమ:
యశశ్విన్యై నమ:
మహారోగ వినాశిన్యై నమ:
మహా క్షేమంకర్యై నమ:
మహా విష నివారిణ్యై నమ:
మహా శుభద్రాయై నమ:
మహాసత్యై నమ:
మహా నిత్యాయై నమ:
మహా శివ ప్రియాయై నమ: -130
చిన్మయాకారాయై నమ:
కాత్యాయిన్యై నమ:
మాతృకాయై నమ:
అజ్ఞాన శుధ్యైనమ:
సృష్టి రూపాయై నమ:
పురుషార్ధ ప్రదాయిన్యైనమ:
వరదాయై నమ:
భయ నాశిన్యైనమ:
విశ్వ తోష్యణ్యైనమ: -140
కుల సంపత్ప్రదాయై నమ:
ప్రణవాత్మికాయై నమ:
ఈశ్వర్యై నమ:
చింతితార్ధ ఫల ప్రదాయి నమ:
సర్వ మంత్ర మన్యైనమ:
అమేయాయై నమ:
అక్రూరాయై నమ:
సర్వాస్త్ర ధారిణ్యై నమ:
భూమిజాయై నమ:
స్వతే తేజసాయై నమ: -150
బ్రాహ్మైనమ:
జగద్ధితాయై నమ:
మాన్యాయై నమ:

నిరాంజనాయై నమ:
నిగమ గోచరాయై నమ:
పూజ్యయై నమ:
ధర్మ ప్రియాయై నమ:
సర్వోపద్రవ వారిణ్యైనమ:
లోకానంద దాయికాయైనమ:
ఓం శ్రీ శమీ దేవతాయై నమ: -160





రచన :- బ్రహ్మశ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ ఎమ్ ఏ, బి ఇ డి

అధ్యక్షులు సరసభారతి
సాహిత్య సాంస్కృతిక సంస్థ - ఉయ్యూరు

ధర్మకర్త శ్రీ సువర్చలాంజనేయ స్వామి ఆలయం - ఉయ్యూరు




## శమీ పూజ ప్రాశస్త్యం

'శమీపూజ' అనగా జమ్మిచెట్టునకు పూజ చేయుట. ఇది విజయదశమి రోజున అన్ని దేవాలయములలో అనాదిగా జరుగుచున్న క్రియ. దీనికే జమ్మి కొట్టుట అనే వ్యావహారిక పదము. పూర్వము మహిషాసురమర్దని అమ్మవారు మహిషాసురునితో తొమ్మిది రోజులు పోరాడి పదవ రోజైన ఆశ్వయుజ శుద్ధ దశమి రోజున వానిని సంహరించి విజయము సాధించిన రోజు అగుటచే యీ దినమునకు విజయదశమి అను పేరు సార్ధకమైనది. ఆ కారణమున రాజులు, జమీన్‌దారులు లోక కల్యాణమును కోరిన వారై, వారి విజయమును కాంక్షించూ, వారి వారి పరిపాలనలోయున్న దేవాలయములు యందు శమీపూజోత్సవములు జరిపించుట పరిపాటి అయినది. ఈ క్రియ వైఖానసాగమశాస్త్రము నందు భృగుప్రోక్తమైన క్రియాధికారము నందు ముప్పది రెండవ అధ్యాయమున వివరింపబడినది. కార్యక్రమము యిట్లున్నది. ఆ రోజు ఉదయమున యజమాని స్నానాదులాచరించి శుద్ధ వస్త్రధారియై దేవాలయమునకు వచ్చి శ్రీ స్వామికి స్నపనాదులాచరింపచేసి నూతన వస్త్రాభరణాలంకారాదులర్పించి విశేషపూజలు చేయించి స్వామికి నివేదనలు సమర్పించి, సాయంకాలం పూజానంతరం స్వామిని గుఱ్ఱపు వాహనముపై అధిష్ఠింపచేసి సర్వవాద్యములు, వేదఘోష, ఛత్రచామరాద్యలంకారములతో శమీ వృక్షమెచ్చట కలదో అచటకు వెళ్లి, వృక్షమునకు, ఆయుధములకు పూజలు కల్పోక్తరీతిని ఆచరించి రాజైన యజమాని విజయమును కాంక్షించినవాడై ధనస్సునందు బాణములను సంధించి తూర్పు మొదలు నాలుగు దిక్కులందును, వృక్షాగ్రమునందును బాణములు వదులను. ఒక విజయపత్రమును వ్రాసి చెట్టుయందుంచుదురు. "శమీ శమయతేపాపం శమీ శత్రువినాశని। అర్జున స్యధనుర్ధారీ రామస్య ప్రియదర్శినీ॥ అను శ్లోకమును కాగితముపై వ్రాసి చెట్టు యందు ధరింపచేయుదురు. యజమానుడు, ఆచార్యాది భక్తులు అందరు వృక్షమునకు, దేవునకు ప్రదక్షణములు చేసి శమీపత్రమును కోసికొని శిరస్సున ధరించి స్వామితో కూడి గ్రామ ప్రదక్షిణం చేసి ఆలయమునకు వత్తురు. జమ్మి చెట్టునకు అంత ప్రభావము వచ్చుటకు కారణము ఆ వృక్షమునకు అధి దేవత అగ్నిదేవుడు. అగ్నిదేవుని ద్వారనే మనం అందరు దేవతలకు హవిస్సునందించుచున్నాము. ఆయన ద్వారా అందరు దేవతలను ఆహ్వానించుచున్నాము. ఉదాహరణకు "హిరణ్యవర్ణాంహరిణీం ..... జాతవే దోమమావహ" అని శ్రుతి అవగా "లక్ష్మీ దేవిని నేను పూజించుట కొరకు ఆమెను ఆహ్వానింపుము" అని భావము. అట్లే అందరు దేవతలను అయన ద్వారా ఆహ్వానించుట, హవిస్సులందించుట జరుగుచున్నది అట్టి ప్రభావము గల అగ్ని యీ వృక్షమునకు అధి దేవుడై యుండుటయే యీ వృక్ష ప్రాముఖ్యము. శాస్త్రము నందు యిట్లున్నది.

శ్లో॥ శమీతికీర్తనాదేవ పాపం నశ్యతి వాచికం। స్మరణాన్మానసం పాపం స్పర్శనాత్కాయజం తథా। నిత్యం త్వత్పూజనాద్ధ్యానా ద్వదనాచ్చేవ భక్తితః। నిర్విఘ్న కరమాయుష్యం జ్ఞానం పాపక్షయోపిచ॥ అని శమీ ప్రభావమును వర్ణించిరి. అనగా "శమీ" అని నోటితో అనగానే నోటితో చేసిన (వాక్కులతో) పాపములు నశించును. మనస్సుతో శమీ అని తలచుకొన్నచో మనస్సుతో చేసిన పాపములు నశించును. వృక్షమునకు తాకి నమస్కరించిన శరీరముతో చేసిన పాపములు పోవును. ప్రతిరోజు వృక్షమును పూజించి, ధ్యానము

త్రిప్పి చూడుము

నమస్కారములు చేసిన పాపములు నశించి దీర్ఘాయువు జ్ఞానము కలుగును అని చెప్పుటచే ఆ వృక్షము యొక్క ఔన్నత్యము తెలియుచున్నది. ఇక కాగితముపై వ్రాసిన శ్లోక భావము - శమీ పాపములను పోగొట్టును. శత్రువులను నిర్మూలించును. అర్జునుని ధనస్సును ధరించినది. ఈ కథ భారతమున కలదు. " ఇక రామస్య ప్రియదర్శినీ " ఎట్లు? అని తెలుకొనవలసియున్నది. ఆ విషయము ఆనంద రామాయణము, రాజ్యకాండ, ఉత్తరార్ధము నందలి 19 అధ్యాయం రాముని దినచర్య యందు ఇట్లున్నది " ప్రాత: సంధ్యాంతత: కృత్వా బ్రహ్మయజ్ఞం విధాయచ। దత్త్వాదానాన్యశేషణ యయౌగేహం రథేనహి। హుత్వాహొమం విధానేన శివం సంపూజ్య సాదరం। కౌసల్యాంచ సుమిత్రాంచ కైకేయీంచ సమర్చయత్। కామధేనం కల్పవృక్షం పారిజాతంతు పుష్పకం। చింతామణిం కౌస్తుభంచ పూజ్యసేతి యతోహరి: ముని వృక్షం వటం బిల్వ మశ్వత్థం తులసీం తథా। శమీం పలాశం దూర్వాంచ రాజవృక్షమ్ పూజయత్..... సంపూజ్య మకుటం రామ: పూజయతు సమంచకం....... పున: సంపూజ్య స్వగురం పూర్వం విప్రేః పూజితం। ఉచ్ఛాసన స్థితం నత్వాక ధాంసుశ్రావ తన్ముఖాత్.... అని యుండుట వలన రాముడు నిత్యము పూజిందు వృక్షములలో జమ్మికూడుయుండుట వలన "రామస్యప్రియదర్శిని" అయినది. రాముని గురువుగారైన వశిష్ఠ మహర్షి వైఖానసుడు. అందువలన రాముని వివాహము వైఖానస సూత్రానుసారము జరిగినట్లు వాల్మీకి రామాయణమున కలదు. (అట్లే నిత్యహోమానంతరం వైశ్వదేవమునందు గృహమునందలి అన్ని వస్తువులకు బలి వేయవలయును. ఆ కారణమున మంచమునకు కూడా బలివేసి నమస్కరించినట్లున్నది వైఖానస సూత్రము నందు నిత్యవైశ్వదేవమునమంచము యొక్క తలవైపు, కాళ్లవైపున కూడ బలిచెప్పబడియున్నది).

ఈ ప్రకారం శమీపూజను ప్రతి దేవాలయము నందు కూడా ఆచరించి సత్ఫలితములను అందరు పొందవలసియున్నది.